ములు మూలంగా పారిశ్రామికుల తరఫువారు మరింత ప్రకోపించి మరికొన్ని మాటలు అలాపనచేశారు. లాభపంపిణీల విషయములో చేయబడిన నిబంధనలు వ్యాపారలాభముల పన్నుతోసహా గవర్నమెంటువారు తీసివేసిరి. ఈవిధంగా తమ కట్టుబాట్లను సడలించి తొలగించుటమూలముగాను, కేంద్రములోను రాష్ట్రములందును ఇండస్ట్రియలు ఫైనాన్సు కార్పొరేషనుద్వారా, (పారిశ్రామిక ద్రవ్య సహాయసంస్థ ద్వారా) చౌకవడ్డీ రేట్లకు ద్రవ్యమును సప్లయిచేయుట మూలముగాను చేయూతనొసంగుచు ప్రయివేటు వ్యాపారసంస్థలకు సహాయం చేయవలెనని ప్రభుత్వము సంకల్పించుకొన్నది. 1949 సంవత్సరము ఫిబ్రవరిమాసములో మద్రాసునందు వాణిజ్య మండలివారు సర్దారుపటేలుకు సమర్పించిన వినతిపత్రమునకు తగిన సమాధాన మిచ్చుచు యీ క్రిందిరీతిన ఘంటాపథముగా ఒకమాట అన్నారు.

“పరిశ్రమలు ప్రభుత్వాయత్తము చేయబడునని భయపడవద్దు. ఏ పరిశ్రమనైనను ప్రస్తుతము ప్రభుత్వము దఖలుపరచుకొనుటకు తగిన శక్తిసామర్థ్యం యీ ప్రభుత్వానికి లేదని వేదవాక్యంగా నా మాట నమ్మండి. కాబట్టి, దేశపరిశ్రమలు ప్రభుత్వాయత్త మొనర్పబడునని ఎవరైనను పల్కినయెడల, అట్టివాడు తానొక బ్రహ్మాండదగాయనుణ్ణి కావలెననే తలంపుతో ఆవిధంగా పల్కుచుండును. అటువంటివాళ్ళను నేను నమ్మను.”

భారత ప్రభుత్వ ఉపప్రధాని అధికారరీత్యా చేసిన యీ బహిరంగప్రకటనద్వారా, ఆందోళనపడినవారి కందరికి చిత్తశాంతి కలిగియుండవచ్చు. కాని, దౌర్భాగ్యవశమున మన జాతికి వాచాలత్వ మెక్కువ. పైజెప్పిన బహిరంగప్రకటన జరిగినప్పటికి కూడా, కొందరు మంత్రులింకను పరిశ్రమల ప్రభుత్వ వశీకరణ ప్రస్తావన చేయుచునేయుండిరి. ఈ విధమైన ప్రసంగాలమూలముగానే యీ దేశములోని సమస్త దురవస్థలు దుర్భిక్షములు సంభవించుచున్నవని పారిశ్రామికులు బాహాటముగా చాటించుచున్నారు.

ఈ విషయములో సర్వతోముఖపరిశీలన చేసి చూడగా, అసమర్థులమైన మనము, ఇతరులను పాపాలభైరవులుగా చేసి, మన ప్రయోజకత్వమునకు వారే కారకులనుచున్నాము. చాలా ఉన్నతస్థాయిలో ఉన్న ఏ కొలదిమంది పారిశ్రామికులనో మినహాయించినచో, పారిశ్రామికులమని చెప్పుకొని, కొన్ని పరిశ్రమలను నెలకొల్పి నిర్వహించుచున్నవా రందరికీ, పారిశ్రామికశబ్దం సార్థకంగా అన్వయించదు. ఇట్టివా రందరూ సర్వదా వ్యాపార లాభకాంక్షతో వర్తిస్తూ గ్రహపాటున పరిశ్రముల రంగములోనికి దిగిన సాధారణ స్వల్ప వ్యాపారస్థులనియే చెప్పవలసియున్నది. ఏ పారిశ్రామికుడును లాభాల కాంక్షతోనే పరిశ్రమను ప్రారంభిస్తాడు. ఆ మాట నిజం. కాని అతడు నిజమైన పారిశ్రామికుడైనట్లయితే, నిర్మాణాత్మకమైన ఆత్మసంకల్పోద్యోగ మొకటి అతనిలో ప్రధానంగా ఉంటుంది. సమర్థంగా పనిచేసే భారీసంస్థ నొకదానిని నిర్మాణంచేసి, దానిద్వారా శుద్ధమైన వస్తూత్పత్తి సవ్యంగా సమర్థంగా జరుగుచున్నప్పుడే అతనికి సంతృప్తి కలుగును. ఆ పరిశ్రమను స్థాపించిన కొన్ని ఏండ్లయనంతరమే అతడు లాభాల సంగతి తలపోయును. ప్రథమ ప్రదక్షిణమునకే సహస్రగర్భములై కోరికలు ఫలించవలెనని ఆశించడు.

మన కార్మికుల వ్యవహారము మరింత అధ్వాన్నముగా నున్నది. వీరు సంకల్పశుద్ధిగా ఎనిమిది గంటలు పని చేసినట్లయితే మన పరిశ్రమలు చాలా సుసంపన్నస్థితిలోనికి రాగలవు. మన పారిశ్రామికులలోను, మన కార్మికులలోను ఏర్పడిన సామర్థ్యలోపం వల్ల దేశానికి ఆర్థికంగా దుర్భిక్షం యేర్పడుతోంది. ఈ ప్రపంచంలో ఉన్నత మొక జాతిగా నిలిచి వర్ధిల్లవలెనంటే, పైచెప్పిన ఉభయవర్గముల అసమర్థతాదోషం పోవాలి. ఉభయవర్గములు ఏకైక సమసంకల్పదీక్షతో పనిచేయాలి. లాభైశ్వర్యములవిభాగవిషయములో ఉభయులును వివాదపడుటకు పూర్వము ఉభయుల కృషివల్లను, అధికోత్పత్తియును, లాభైశ్వర్యాభివృద్ధియును కలుగవలసియున్నది.

ప్రభుత్వాయత్తమైనంతమాత్రమున పరిశ్రమలు సమర్థముగా పనిచేయునని వాదింపవీలులేదు. మీదుమిక్కిలి సర్కారు అధికారులు పైన పెత్తనం వహించినప్పుడు, క్రిందివాళ్లకు బేజవాబుదారీ సహజంగా ఏర్పడుతూ ఉంటుంది. క్రిందిశ్రేణిలో మందగతి ఏర్పడుతుంది. ఒక సంస్థను నడిపించేవారికి, ఆ సంస్థలో వారికి ఉండే ఆసక్తి ఆత్మప్రేరణ అంతరించినప్పుడు, పైన ఎంత అజమాయిషీ చేసినప్పటికీ, దానిని చక్కదిద్దుటకు సాధ్యము కాదు. ప్రయివేటు ఆసాములు కార్మికవర్గము, కలిసి మెలిసి కృషిచేసి, వస్తూత్పత్తిని అధికంగా వృద్ధిచేయవలెనంటే నిరంతర ప్రబోధ ప్రచారములును, మంచి లక్ష్యలక్షణ శిక్షణయును కావలసియున్నవి. ప్రభుత్వ వశీకరణము కొంత అవసరమే. కాని, అది అతిస్వల్పముగా నుండవలెను.

మన దేశంలో వస్తూత్పత్తి తగ్గిపోవుటకుగాని, లేదా కొత్త పరిశ్రమల ప్రతిష్ఠించుటకై పెట్టుబడిదారులు ముందంజవేయకపోవుటకుగాని దేశపరిశ్రమలు ప్రభుత్వాయత్త మొనర్పబడునను ప్రభుత్వప్రకటనలు వాస్తవమైన మూలకారణములు కావు. అదేవిధముగా, విదేశీయ పెట్టుబడిదారులు కూడా మనదేశమందు పరిశ్రమలను ప్రతిష్ఠించుటకై తమ పెట్టుబడిద్రవ్యముతో ముందుకు రాకపోవుటకు కారణము మన ప్రభుత్వముచేసిన బాహాటప్రకటన కాదు. ఆ విదేశీయుల సొంతదేశములలోనే వారి పెట్టుబళ్లకు హెచ్చులాభ ప్రతిఫలము లభించుచుండుటవల్లనే వారిచటకు విచ్చేయుటలేదు. మన ఆర్థికసంపత్తి అల్పమైనదేగాని అపారమైనది కాదు. గత యుద్ధకాలంలో ప్రజాద్రవ్యము చాలావరకు పీల్చి పిండివేసినట్లయినది. ఈ దేశములో బ్రిటిష్‌వారికి గల అనేక వ్యాపారసంస్థలను అప్పటి హెచ్చుధరలకు మనదేశస్థులు కొనుక్కొని వారికి ద్రవ్యం కుమ్మరించిరి.

అప్పటి ప్రభుత్వము జారీచేసిన దీర్ఘవాయిదా ఋణపత్రములలో ప్రబలద్రవ్యము విశేషముగా వినియోగింపబడినది. ఆ ద్రవ్యమే కొలదికాలములో అనేక అవసరములకు కావలసి వచ్చును. మన మిప్పుడు ఉన్నదానిని చక్కదిద్దుకొనుచు, పాతకొత్తల సమన్వయావస్థలో ఉన్నాము. ఇక రాబోవు రెండుమూడు సంవత్సరములలో పెట్టుబడిదార్ల వ్యాపారరంగము స్థిమితమై అనివార్యమైన కొలది పరిమిత ప్రభుత్వ నిగ్రహాధికారముతో ప్రయివేటు ఆసాముల వ్యాపారాభినివేశ మభివృద్ధి గాంచగలదు.

---